నూజివీడు తాలూకా మాజీ కల్లుగీత పనివారల కాంగ్రెసు మహాసభ ఇటీవల నూజివీడు నందనవనంలో జరిగింది. ఉయ్యూరు కుమారరాజా మేకా రంగయ్యప్పారావుగారు ఆ సభకు అధ్యక్షత వహించారు. నూజివీడు తాలూకాలో నీరావుత్పత్తికి ప్రభుత్వం అనుమతించినందుకు ఆ సభలో కృతజ్ఞత ప్రకటిస్తూ తీర్మానాలు చేశారు.

న్యూథియేటర్సువారి "యాత్రిక్"లో ఒక దృశ్యం.

విజయవాడ కోఆపరేటివ్ బ్యాంకు నూతన భవనంలో విజయ ఉగాదినాడు శ్రీయుతులు పిక్కిన వెంకటరత్నం, జె. సి. ర్యాక్, ఈద్పుగంటి బాల వీరరాఘవయ్యగారల చిత్రపటాలు ఆవిష్కరించబడినవి. ఆ సందర్భంలో జరిగిన సభలో ప్రముఖ కాంగ్రెసు సేవకులు దుగ్గిరాల బలరామయ్యగారు ప్రసంగిస్తున్న దృశ్యం. చిత్రంలో కనిపిస్తున్నది. ఫోటోలు బొమ్మ వెనుకభాగంలో వున్నవి. మంత్రి సంజీవయ్య, మంత్రి పట్టాభి రామారావుగారలు కూడా చిత్రంలో బలరామ కృష్ణయ్యగారి ప్రక్కన ఆసీనులయి వున్నారు.

ఈ నెల 16వ తేదీన మద్రాసు సహకారశాఖ మంత్రి డి సంజీవయ్యగారు విజయవాడ కేంద్ర సహకారబ్యాంకు నూతన భవనానికి ప్రారంభోత్సవం జరిపారు.

# సినిమా

## నగరంలో సినిమాలు

| | | |
|---|---|---|
| మారగత్ | మరుమగళ్ | (అరవం) |
| ప్రభాత్ | మరుమగళ్ | (అరవం) |
| కామధేను | మరుమగళ్ | (అరవం) |
| లక్ష్మి | 'నాస్' | ,, |
| శ్రీకృష్ణా | 'నాస్' | ,, |
| చిత్రా | 'నాస్' | ,, |
| రాజకుమారి | 'నాస్' | ,, |
| గెయిటీ | మదనమోహిని | ,, |
| బ్రాడ్వే | మదనమోహిని | ,, |
| తిరంం | మదనమోహిని | ,, |
| భవాని | 'మై హోం' | ,, |
| పరస్వతి | 'పణం' | ,, |
| క్రౌన్ | 'రంగీలీముసాఫిర్' | (హిందీ) |
| కాసినో | యాత్రిక్ | ,, |
| న్యూఎల్ఫిన్‌స్టన్ | ఝూన్సీకీరాణి | ,, |
| వెలింగ్టన్ | 'పంఛీగ్' | ,, |
| స్టార్ | 'జన్' | ,, |
| సెలెక్టు | 'శైలబావరా' | ,, |
| అశోక్ | అనందమఠ్ | ,, |

### యాత్రిక్

న్యూథియేటర్సు వారి "యాత్రిక్" హిందీ చిత్రం మద్రాసు, కాసినోలో ప్రదర్శించబడుతోంది. జీవితపరమార్థం కనుగొనేందుకై హిమాలయ పర్వతాల్లోకి ప్రయాణం చేసిన ఒక యాత్రికుని అనుభవాలను ఈచిత్రం చూపిస్తుంది. బెంగాలీలో ప్రభోధ పన్యాల్ అనే ఆయన రాసిన "మహాప్రస్థాన పథే" గ్రంథం ఈచిత్రానికి ఆధారం. ఇది ప్రబోధసన్యాల్ ఆత్మకథ. హరిద్వారం, హృషికేశం, దేవప్రయాగ మీదుగా బదరీనాథ్ క్షేత్రం వరకూ గల పర్వత దృశ్యాలు అలకనంద, గంగా ప్రవాహదృశ్యాలు కేదార్ నాథ్, బదరీనాథ్ దేవాలయాల్లో పూజా దృశ్యాలు అతి మనోహరంగా కనిపిస్తాయి. కార్తీక్ చటర్జీ ఈచిత్రానికి దర్శకుడు, పంకజమల్లిక్ సంగీత దర్శకుడు, వసంత చౌదరి, అరుంధతీ ముఖర్జీ ప్రధాన పాత్రధారులు. ముఖ్యంగా పేర్కొనదగినది. ఇతివృత్తగాంభీర్యానికి సరిపడిన సంగీతం. భారతదేశంలో తయారైనఉత్తమ చిత్రాల్లో ఇది ఒకటని చెప్పవచ్చు.

అనంతపుర కళాశాల వక్తృత్వపు పోటీలో ప్రథమ బహుమతి పొందిన అమలాపురం కళాశాల ఇంటర్మీడియట్ (సీనియర్) విద్యార్థి యల్లాప్రగడ శ్రీరామమూర్తి

విజయ ఉగాదినాడు విజయవాడ కేంద్ర సహకార బాంకు కొత్త భవనం ఆవరణలో "కిదాంబి రాజగోపాలాచారి హాలు"ను ఆంధ్రప్రదేశ్ కాంగ్రెసు ఉపాధ్యక్షులు అయ్యదేవర కాళేశ్వరరావుగారు ప్రారంభోత్సవం జరిపారు.

మద్రాసు రాష్ట్ర సహకార సంఘం అధ్యక్షులు పిక్కిన వెంకటరత్నంగారి ఫోటోను మద్రాసు రాష్ట్ర గ్రామ ప్రభుత్వశాఖామంత్రి ఎస్.బి.పి. పట్టాభి రామారావుగారు ఈ నెల 16వ తేదీన విజయవాడ కేంద్ర సహకార బ్యాంకు నూతన భవనంలో ఆవిష్కరించారు. ఆసందర్భంలో మంత్రి పట్టాభిరామారావుగారు ప్రసంగిస్తున్న దృశ్యం.

నూజివీడు తాలూకా వేలేరుగ్రామం పంచాయతీ అధ్యక్షులుగా ఎన్నికైన శ్రీగోగినేని బలరామకృష్ణమూర్తిగారు

## సంస్థాన ఉద్యోగాల కేటాయింపు

### పిటిషన్ త్రోసివేస్తూ ప్రభుత్వానికి హైకోర్టు సలహా

హైదరాబాదు, మార్చి 19: సంస్థానప్రభుత్వోద్యోగులనియామకం విషయంలో ప్రభుత్వం అమలుజరిపిన నిబంధనలు చెల్లవని మీర్ యూసఫ్ అలీఖాన్ గారు పెట్టుకున్న 'రిట్' దరఖాస్తును త్రోసివేస్తూ హైదరాబాదు హైకోర్టు న్యాయమూర్తులు ఎమ్. ఎ. అన్సారీ. పి. జగన్మోహన్ రెడ్డిగారలు ఈవేళ తీర్పు చెప్పారు.

తాలూకాదార్లను తహసీల్ దార్లను నియమించే సందర్భంలో నూటికి 50 మంది ముస్లిములను, 50 మంది హిందువులను ఎన్నుకోవాలని ప్రభుత్వ నిబంధనలు నిర్దేశిస్తున్నవి.

వాది పైన పేర్కొనబడిన పుద్యోగ పరీక్షలకు హాజరయి ముస్లిమ్ అభ్యర్థులలో ఆరవవాడుగావు ఉత్తీర్ణుడయినాడు. అయితే వాడికి మరొక ముస్లిమ్ అభ్యర్థికి సమానంగా మార్కులు రాగా ఆ ముస్లిమ్ అభ్యర్థికి కొన్ని ప్రత్యేకార్హతలుండడంవల్ల అతనికి ముందుగా పుద్యోగం లభించింది. ప్రభుత్వ నిబంధనల ననుసరించి 5 గురు ముస్లిములు, అయిదుగురు ముస్లిమేతరులను రెండవతరగతి తాలూకాదార్లు (డిప్యూటీ కలెక్టరు)గా ప్రభుత్వంనియమించింది. కొంతకాలమైన పిదపవారి అసలు ఈ పరీక్షలలో తప్పిపోయిన ఒక ముస్లిమేతర అభ్యర్థికి కూడా పుద్యోగం లభించింది. ఈ నియామకం చెల్లదనీ, ఇది భారతరాజ్యాంగానికి విరుద్ధమని వాది వాదన.

వాది యూసఫ్ అలీఖాన్ తెలిపినంత వరకు, ఆయా పుద్యోగాలకు అర్హతగా పరిగణించబడే పక్షంలో అవతికాలంలో ఉన్న హోదాకు సమానమైన హోదాగల ఏ పుద్యోగమైన ఖాళీ కాకపోతే వాది కివ్వగలమని ప్రభుత్వం ఇచ్చిన ఉత్తరువు ప్రభుత్వ న్యాయవాదికోర్టులో హాజరుపరిచారు. ఆ వుత్తరువుదృష్ట్యా వారి దరఖాస్తును న్యాయమూర్తులు కొట్టివేసి, మద్రాసు కమ్యూనల్ జి. వో. ప్రాథమికహక్కులకు భంగకరమని సుప్రీంకోర్టు ఇదివరలో ఇచ్చిన తీర్పు దృష్ట్యా ఈ ఆఫీసునామాన్ని రాజ్యాంగ రీత్యా పరిష్కరించుకోవలసినదని సంస్థాన ప్రభుత్వానికి సలహా యిచ్చారు.

లండన్‌లో మార్షల్ టిటో—ప్రధాని చర్చిల్, విదేశాంగమంత్రి ఆంథోనీ ఈడెన్ స్వాగతమిస్తున్న దృశ్యం.



Edited, Printed & Published by S. Sambhu Prasad at the Andhra Patrika Press, No. 7, Thambu Chetty Street Madras.